

సంపుటి 8

సంచిక 12

[illegible]ెంబరు 196[illegible]

విడి ప్రతి 0-25 పై.

సాలుచందా రు. 3-00

భారత ప్రణాళికా కృషి

పిల్లల విద్యాభివృద్ధి

# రవాణా సమాచార్

# RAVAANA SAMACHAR

# रवाणा समाचार

తెలంగాణా డిప్యూటీ ట్రాన్సుపోర్టు కమీషనర్
శ్రీ జి. వి. కృష్ణారెడ్డి. యం. ఎ. గారి టూరుప్రోగ్రామ్

| తేదీ | ప్రోగ్రాము |
| --- | --- |
| 9-12-1965 | నల్లగొండ వెళ్ళుతారు |
| 10-12-1965 | |
| 11-12-1965 | నల్లగొండలోవుంటారు. |
| 12-12-1965 | తిరిగి హైదరాబాద్ చేరుతారు. |

డిప్యూటీ ట్రాన్సుపోర్టు కమీషనర్
(తెలంగాణా) హైదరాబాద్.

సంపుటి 8

సంచిక 12

ఫోన్ నెం. 1087

రిజిష్టర్డు నెం.

హెచ్ - 103




ధరల నదుపులో

ఉంచేందుకు

సహాయ పడండి.

* * *

దేశరక్షణకోసం

పొదుపుచేయండి.

ఎడిటర్ : జిల్లేపల్లి భాస్కరరావు

విశ్వావసునామ సంవత్సర మార్గశిర శు॥ అష్టమి బుధవారము 1—12—1965

# కాగల కార్యములు

నిజం నిలకడమీదగాని తెలియదు. అయినా యే మానవ ప్రకృతి కాగల కార్యానికి కావలసినంత కృషి చేయడానికి వెనకాడదు కానున్నది కాకమానదుగదా! దానికై కృషిదేనికి? మనంఅంటూ కొంత ప్రమేయం పెట్టుకున్నాం కాబట్టి. ఈ మనం యెవరు? ఈ ప్రశ్నకు సమాధానం సమిష్టి సాధనామార్గమైనా కావచ్చు, వ్యక్తిగత అహంకార నిర్దేశమైనా కావచ్చు. సమిష్టి సాధనామార్గమైతే యెక్కడ మొదలై యెక్కడ సమసిపోతుందో చెప్పలేము సాగిననాళ్ళు చాలాసులువుగా దొర్లిపోతూ చాలా గొప్పగా చెప్పబడుతుంది. వ్యక్తిగతమైతే ఆద్యంతాలు తెలుస్తూనే వుంటుంది. తాపత్రయపుబుద్ధి స్వార్థానికి మచ్చికచేసే మందు. తాపత్రయం లేనిదే లక్ష్యభావం కనిపించదు. లక్ష్యభావం సాధనామార్గానికి ద్వారంలాంటిది. సాధన సాగితేగాని సాఫల్యత గోచరింపదు. సాఫల్యత పొందినాపొందకపోయినామనతరంలో వెల్లడయిన ప్రతిఫే చెప్పదగిన సాఫల్యత.

ఈ మానవ మనస్తత్వ సిద్ధాంతంపై ఆధారపడి నడిచేవ్యాపారమే రవాణా అభివృద్ధినిగూర్చి చెప్పదలుచుకొన్నప్పుడు గోచరిస్తుంది. భూభాగం యెక్కువగావున్న మనదేశంలో అన్ని రవాణాల కంటె రోడ్డురవాణా అభివృద్ధి తగినంత వేగంగా అత్యధికంగా రూపొందవలసివున్నది. ప్రభుత్వపు బాధ్యతలు ఒకఏటి

కంటే మరొక యేదు విపరీతమవటంవలననూ ప్రజాప్రభుత్వపు నిలకడ ప్రజల నిలకడపైనే ఆధారపడి వుండటంవలననూ కాగల కార్యాల సాగింపునకు సమిష్టివిధానం ఆశయంగా చెబుతూ వ్యక్తి విధానం జొప్పింపక తప్పటంలేదు అంటే వీలున్న విధానాలన్నింటిని ప్రయోగించి లక్ష్య సాధనకు పూనుకోక తప్పటంలేదు దానివలన చెప్పేమాటలకు, చేసేపనులకు విభిన్నత గోచరింపవచ్చు ఆద్యంతాలు వేరైనా ఆశయాలు కనిపిస్తే లక్ష్యసిద్ధి కలిగినట్లే

అభివృద్ధి ప్రణాళికావసరాలు, అత్యవసర పరిస్థితులు, ఆర్థికపు దిగుబాట్లు సర్దుబాట్లు కలిసి రూపొందించే అనేక లోటుబాట్లు మధ్య సాగే స్వతంత్ర ప్రజాస్వామ్య ప్రభుత్వవిధానం ఉత్పత్తి దారుని మద్దతుగా నిలబడటంలో వినియోగదారు యోగక్షేమాలు గమనించే సావకాశం పొందలేక రాబడిని యినుబడించాలని ప్రయత్నిస్తున్నది తాహతునకు తగిన విధానంగాక ప్రోత్సాహిత ఔచిత్యాన్ని పాటించి ముందడుగు వేయటంలో సత్ఫలితాలు పొందకపోవటం కూడా గమనింపగలగాలి

రోజులుదొర్లిపోతూ ప్రాణాలు నిలబడితే చాలు ననుకొనే ప్రజాసముదాయపుపాలనలో ప్రజలకు పరిశ్రమల నిలబాటుగాని నిశ్చితమైన రక్షణతో సాగే అభివృద్ధి అంచనాలుగాని తోచటంలేదు తోచని విషయాలపై ఆలోచనలు సాగించేసావకాశంలేక రోడ్డురవాణారంగం యీనాడు పబ్లిక్, ప్రయివేటు స్థాయిలలో సాధించిందేమీ లేదు. అటు సమిష్టిగాగాని యిటు వ్యక్తి తరఫునగాని పరిశ్రమ పోషింపబడని కారణంవలన తాహతునకు మించిన పనిగానే సాగి యెదురుదెబ్బలు తగలటం గమనింపగలము ప్రజలు రవాణా వ్యాపారరంగంలో పెట్టుబడి సంపాదనల నిష్పత్తి విడిచి కమీషన్ ధోరణికి గురికావటంవలన కాలయాపనకాగల కార్యములు సాగటమేగాని యదార్థమైన అభివృద్ధిని పొందలేకపోవడం పరిశ్రమకు సంబంధించిన వారందరూ గుర్తించాలి మంచిరోజులు కావాలి. సౌకర్యసాధనాలు అందుబాటులో మన్నికగా పనిచేయాలి ఉత్పత్తిదారు, పరిశ్రమదారులతో బాటు వినియోగదారు అనుభవింపగలిగేది విపత్తు కారాదు ప్రణాళికా వ్యాఖ్యాతలు ఈ విషయాన్ని విస్మరించినట్లు వారి విధానాల సారూప్యమే చెబుతుంది వీటిని సవరించి వివరించేందుకు యేపరిశ్రమదారూ పూనుకోలేదనే యదార్థమువలన నిజమైనఅధికారవర్గీయులు అలక్ష్యం చేయటంతో కాగల కార్యాలు కాలయాపనలో కలిసిపోవటంతో పరిశ్రమ దెబ్బతింటుంది. ప్రజల సహకారం కోరే ప్రభుత్వాలు తమ విధి నిర్వహణకు పెడదారులుబట్టకుండా బాధ్యతల స్వీకరణతో లక్ష్యసాధనకు సహకారాన్నియిచ్చి పరిశ్రమను గడను పోషించాలి.

---

— మనవి —

1965 సంవత్సరపు రవాణాసమాచార్ చందాలు చెల్లించని చందాదారులు వెంటనే చందాలు పంపాలని ప్రార్థన. ఇకముందుకూడా మామూలుగా చందాలు చెల్లిస్తూ సహకరించాలని కోరడమైనది.

# లారీ ఆపరేటర్ల ఊహలు - ఉత్సాహాలు

[హైదరాబాద్ సమావేశంలో]

—*•*—

కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాల లారీ ఆపరేటర్ల ఎసోసియేషను మెంబర్లు కొందరు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డిగారితో హైదరాబాదులో ఈమధ్య సమావేశమైనారు. ఈ సమావేశములో రవాణామంత్రి శ్రీ బి వి గురుమూర్తి, రోడ్ల మంత్రి శ్రీ టి వి రాఘవులు. శ్రీ చేబ్రోలు హనుమయ్య (ఎం.ఎల్ ఏ), శ్రీ హరిశ్చంద్ర ప్రసాద్ (ఎం.ఎల్.ఏ.) గారు పాల్గొన్నారు ట్రాన్సుపోర్టు కమీషనర్ శ్రీ హెచ్. సాంబమూర్తి, శ్రీ జయరామరెడ్డి, ఛీఫ్ యింజనీరు శ్రీ కృష్ణారెడ్డిగారు మొదలయిన అధికారవర్గీయులుకూడా పాల్గొన్నారు.

ఆంధ్రప్రదేశ్ లారీఓనర్సు ఎసోసియేషన్‌గా రూపొందగల లారీ ఆపరేటర్లు కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలనుండి అందించిన మెమోరాండంలో తమతమలారీలు నేషనల్ హైవేస్‌మీద మోయటానికి అనుమతింపబడిన బరువుం , ఇతర స్టేటు హైవేసు, డిస్ట్రిక్టు రోడ్లపైకూడా తిరిగేసావకాశాన్ని కల్గించాలని అభ్యర్థించారు. అందుకు ఛీఫ్ యింజనీరు అభ్యంతరాన్ని చెబుతూ ఆయారోడ్లపై అధిక బరువునకు నిలువగలిగే కల్వర్టులు, బ్రిడ్జీలు వుండనికారణంవలన సౌకర్యాన్ని యినుమడింపచేయలేకున్నారు లోగడ విజయవాడకు ట్రాన్సుపోర్టు కమీషనర్ గారు వచ్చినపుడు అందించిన మెమోరాండంలో యీ విషయాన్ని తెలియజేయగా బలహీనమైన రోడ్లను బలపరచి రోడ్ల విభాగంవారు సర్టిఫై చేస్తే గాని అధికమైన బరువులు మోయటానికి అనుమతింప వీలులేదన్నారు. ప్రభుత్వంవారు విధించిన పన్నులను సక్రమంగా చెల్లించే ప్రతి రవాణాసర్వీసు యజమానికి ప్రభుత్వమువారినుండి ఆ చెల్లింపునకు సరియైన సదుపాయం పొందడానికి దాన్ని గురించి ప్రశ్నించటానికి హక్కువుంది కనుక ప్రస్తుత సమావేశాన్ని నిర్దేశించటమైనదిగా చెప్పబడినది.

అన్యాయిక పరిస్థితులమధ్య అసంపూర్ణ విధివిధానాల వలన తగినంతగా ప్రభుత్వం రోడ్ల నిర్మాణదశలు త్వరితగతిని పూర్తిగావింపజాలనందున యీ సావకాశం కల్పించి అధికతరమైన బరువుల చేరవేత అనుమతింప బడలేదని సమావేశంలో తేల్చి చెప్పబడింది. సభ్యుల తర్జన భర్జనల మధ్య తేలిన సారాంశం వల్లన సలహా సంయుతమైన విధానం యాపొందింపబడి చర్చింపబడింది. రాష్ట్ర సౌభాగ్యం కోరే ప్రజలు ప్రజాప్రతినిధులు ప్రజాప్రభుత్వాలు సౌకర్య సముపార్జనకు తగిన విధానాలను గురించి అనుసరించటంలో విశేషం లేదు కాని ఈ నాటికే అధికమనుకొనే

మోటారుబండ్ల పన్నుతో అదనంగా ప్రతి వ్యవహారస్థుడు, వ్యాపారస్థుడు రోడ్డు ఫండును ప్రత్యేకించి ప్రభుత్వానికి చెల్లిస్తే ఆ సొమ్ము యితరంగా వాడకుండా పాతబడిగాని అనుమతింపబడవలసిన బరువుచేరవేతకువీలుగా నిర్మింపబడు రోడ్లు, కల్వర్టులు, బ్రిడ్జీలు వగైరాల నిమిత్తం మాత్రమే ఖర్చుచేసే హామీతో ప్రభుత్వం ప్రత్యేకమయిన వసతిని కల్పించి సౌకర్య సాధనను కృషి చేయడానికి అంగీకరించింది. అంగీకారాన్ని సూచించే ఆర్డరులేకున్నా నలుగురి మధ్యా నలిగిన వ్యవహారం గనుక అవసరమును కొన్న యీ సదుపాయ సాధనకు ప్రతి ఒక్క లారీ, బస్సు ఆపరేటరు స్థిరబుద్ధితో సహకరింపవలసి వున్నది. ఈ రోడ్డు ఫండ్ వసూలు నిమిత్తం మూడుసంవత్సరాలబాటు ప్రతియేటా ఒక కోటి రూపాయిలకు తగ్గకుండా ప్రభుత్వానికి అదనపు చెల్లింపునకు బాధ్యతపడుతూ ఆంధ్రప్రదేశ్ లారీ ఓనర్ల ఎసోసియేషన్ అనదగు సభ్యుల సంఘపు మునాయిదాతీర్మానపు ప్రతిని ప్రభుత్వానికి అందజేస్తే ఈ వసూలు కార్యక్రక్రమాన్ని చట్టబద్ధంగా రాష్ట్రమంతా అనువర్తింపుచేసి అధిక సౌకర్య సాధనకు పూనుకుంటారు ఏ జిల్లా కా జిల్లాలో కావలసిన వసతుల లిస్టుతోబాటు సలహాలు సంఘసభ్యులు పంపితే వానినివిచారించి ఆచరణకు అనువయినవిధంగా రూపొందించి పనులు జరిపిస్తారు. ఈ పనుల పరామర్శకు కమిటీల యేర్పాటు, అందుకయే ఖర్చు ప్రభుత్వం భరిస్తూ ప్రజాసహకార సంపదకు రెట్టుకు రెట్టుగానైనా ప్రభుత్వ సహాయం సమకూరుస్తూ నిర్వహణజరిపించడం ఉచితమని అభిజ్ఞులు భావించడంగూడా జరిగింది. ఈ కమిటీలలో ప్రభుత్వ ప్రతినిధులతోబాటు ఏ జిల్లా పనులు జరిగేందుకు ఆచరణ కార్యావలోకనకు ఆయాజిల్లాలలో అనధికార సభ్యుల సహకారంతో ముందడుగు వేయాలని గుర్తింపబడింది. అంటే ఈనాడు జరిగే కాంట్రాక్టుపనులవలెగాక ప్రజల పెట్టుబడితో కలసిన ప్రభుత్వరంగపు పెట్టుబడి సార్థకత సాధించే సావకాశాన్ని రూపొందించడానికి పునాదులు వ్యూహింపబడినాయి ఇక ఆచరణ కార్యక్రమావలంబనకు ముందడుగువేయుటమే మిగిలింది. ఈ సంప్రదింపు ఫలిస్తే లారీలు అధికబరువు మోయుటమనే దుర్వ్యాపార వ్యామోహము మందగించి కేసులబెడద సన్నగిలవచ్చుననే ఆకాంక్షతో మెమోరాండంలోని రెండవ భారమయిన చెక్‌పోస్టుల వ్యవహారము చర్చింపబడలేదు

మూడవఅంశంగా ముచ్చటింపబడిన గోదావరి పెర్రాపై ఖాళీబండ్ల కదలికను అనుమతించేటప్పుడు వసూలుచేయబడే సుంకంలోని ఆధిక్యతపై తగ్గింపుకోరికమేరకు గుర్తింపబడి విడిగా ప్రభుత్వాదేశానికి నిర్ణయంతీసుకోబడింది. ఆఖరి మాటగా ఆలోచింపబడిన చర్చనీయాంశము మద్రాసురాష్ట్రంలో మన రాష్ట్రపు లారీలు బరువు చేరవేతకువీలుగా అధికబరువుల మోతను అనుమతించేవిధానాన్ని సాధించేందుకు సాగింపవలసిన మూజువాణీ మంతనాల ప్రమేయము మంత్రులు నవ్వుకుంటూనే మాటాడారనుకోండి ఆ విషయం— మన రాష్ట్రంలో అధికబరువుల మోతను గుర్తించి వర్తించినప్పుడుగదా యితర రాష్ట్రాల విధానాలపై సడలింపు సవరణలకై అభ్యర్థన. ఈ వాదంతో అసలునకే మోసము కలిగించకుండా, వచ్చినసభ్యులకు నిరాశలు

కల్పించకుండా, రోడ్లనిర్మాణ సౌష్టవతను పెంచిగాని అధిక బరువుల కనుమతింపు కలుగ వీలులేదన్న విషయాన్ని తిరిగి చెబుతూ అందుకు 'రోడ్ ఫండ్' వసూలువిధానాలు చూపించి పుణ్యంకట్టుకోమని లారీ ఆపరేటర్ల సంఘాలకు విజ్ఞప్తి చేయడమైనది,

శ్రీ పినమలూరి కేశవరావు, చెన్నుపాటి శేషగిరిరావు, అమ్మేశ్వరరావు (కృష్ణా) శ్రీదై తిరుపతయ్య, సుబ్బారామయ్య, రాఘవయ్య, అక్కిరెడ్డి, బాబూ రాజేంద్రప్రసాద్ (గుంటూరు) శ్రీ జి సత్యనారాయణ, యస్. వి. సుబ్బారావు, (తణుకు) ఆర్ శ్రీమన్నారాయణ, సూర్యారావు, రాఘవులు, రాజు (భీమవరం) శ్రీ యస్ సూరిరెడ్డి, మహమ్మద్ హుస్సేన్, పి సోమరాజు, రాజారావు, వెంకట్రావు (నిడదవోలు) శ్రీ ఈవి ఆంజనేయులు, సుబ్బారావు, సత్యనారాయణ, ఆంజనేయులు, చక్రధరరావు, (తాడేపల్లిగూడెం) శ్రీ కె. దుర్గారావు, డి. సత్యనారాయణ (ఏలూరు) వగయిరాలు మెమోరాండం సమర్పించారు.

గత సంవత్సరంనుండి జరుపదలచుకుంటున్న ఆంధ్రరాష్ట్ర లారీ ఓనర్ల సంఘ వార్షికోత్సవం గుంటూరులో జరిపేందుకు డిశంబరు నెల 4వ తేదీని నిర్ణయించుకుంటే తాను రాగలనేమోనని ముఖ్యమంత్రి అన్నారు హైదరాబాదులో జరుపరాదా అని ప్రశ్నించారు.

రవాణా అధికారులు, [illegible] ఆపరేటరు చెడిపోయే రోడ్లపై బ్రిడ్జిలు కల్వర్టుల రిపేరీకి వీలుకలిగించేందుకు ధనసహాయం అందించి ప్రభుత్వానికి అండగా నిలబడటానికి పూనుకోవటం గొప్ప విషయంగా వర్ణించారు అదనపు ఛార్జి మాటికి 30 వంతులు చేయడానికి కృషి చేసేగాని ప్రస్తుతం తిరిగే లారీలు, చిన్నకార్లు, ప్రయివేటు బస్సులు మోటారుసైకిళ్ళు మొదలయిన అన్ని తరగతులవాహనాలపైనా విధింపు జరిగితేగాని వీలుకలుగదని అంచనావేశారు.

సాలుకు కోటిరూపాయల అదనపు సొమ్ము వసూలు జరగాలి అమలులోవున్న పన్నుల చెల్లింపే నిర్ణీతకాలంలో జరుపలేని ఆర్. టి. సి వారు అదనపు చెల్లింపునకు అంగీకరించరనే అనుమానంతో వారిపై రుద్దే వుసులుబాటు ప్రభుత్వానికి కలుగదనుకొన్నారు. పోనీ ప్రతి ఆరు నెలలకూ జరుపబడే బ్రేక్ ఫిట్‌నెస్ ఫీజు 25 నుండి 50 రూపాయిలకు మార్చితే కొన్ని లక్షలు మాత్రమే అదనంగా అందుతాయి. అన్నిరకాల ఫీజులు మార్చివేస్తే ప్రజాందోళన కలుగవచ్చునన్న చర్చలతో లారీ ఆపరేటర్లు సాధింపదలచిన ఆశయసిద్ధికి మొదట్లో ఈ అధిక్యమైన పన్ను చెల్లింపు పెంపునకు సిద్ధబడితే ఆదర్శప్రాయులౌతారని, మున్ముందు విశాలమైన కల్వర్టులు, బ్రిడ్జిలపై నేషనల్ హైవేస్‌తోబాటు స్టేట్ హైవేస్ జిల్లా రోడ్లలోకూడా అధిక బరువుల మోతకు అనుమతిపొందగలరని అభిలషించారు. ప్రభుత్వంవారి ప్రణాళికావసరాల నిమిత్తం రామగుండం థర్మల్ ప్రాజెక్టు విస్తరణ విశాఖపట్నం నౌకాకేంద్ర విస్తరణ, ఉక్కు-యినుము ఫ్యాక్టరీ నిర్మాణం వగైరాలవల్ల కలుగబోయే రవాణా యొద్దడిని తట్టుకొనేందుకు వీలుగా బవర్, హెవ్వీల లారీల దిగుమతి వాడకాన్ని లారీఆపరేటర్లు వినియోగించుకోవాలంటే ఈనాడు చేయదలచిన కించిత్ త్యాగంవలన అత్యధిక ఫలితాలు రానున్నట్టు వ్యాఖ్యానిం

చారు

ముఖ్యంగా యేజిల్లా కా జిల్లా లారీ యూనియన్లు తమ సొంతవతను నిర్మించుకోవడానికిది యొక మెట్టుకాగలదని తద్వారా వారికి వారే దేశసౌభాగ్యసాధనా కార్యక్రమంలో పాల్గొంటూ లోడ్ క్యాన్వాసింగు ఏజన్సీలు, రిపేరు వర్క్-షాపులు, సామాన్ల అమ్మకం స్టోర్సు, పెట్రోలు – ఆయిల్ బంకులు వగైరా లెన్నో రకములయిన అభివృద్ధి విధానాలను సమిష్టి కృషితో సాధింపవచ్చునని, మధ్యవారి ప్రమేయం లేకుండా అప్పు లిచ్చిపుచ్చుకునే ఏ పి. యేర్పాట్లు పొందగలరని, తమంతతామే ప్రభుత్వ రంగంలో జొరబడే సావకాశం కలుగగలదని అన్నివిధాలా యీ సమావేశపు శక్తి ఉత్సాహ ధైర్య సాహసాలు చరిత్రప్రసిద్ధి కాగలవని అభిజ్ఞులు అంచనాలు వేశారు. అంతిమ ఆచరణ విధాన కార్యక్రమం లాభాలు సంపాదించే దేశసేవకులైన లారీ ఆపరేటర్లకే వదలుదాం!

o—o

కొత్తరకం ట్రక్కులు –

ఇటీవలి రోజులలో తయారయిన అందమైన ట్రక్కులలోకన్నా ఆకర్షణీయమైనది ఒకటి యిటీవలనే పశ్చిమ జర్మనిలో తయారయింది అకస్మాత్తుగా చూస్తే, యిదేదో పొరబాటున తయారయిందనుకోవచ్చు ముందు చూడగానే యిది యెక్కడో 'పొట్టిగిత్త' లకు తయారయినదా– అనిపించవచ్చు ఇలా చూడటానికి చిన్నదే అనిపించినప్పటికీ,దీనివల్ల యెన్నో సాంకేతిక ప్రయోజనాలు కొత్తగా లభిస్తాయి. —

తే 21–10–1965 గురువారం సాయంకాలం 3 గంటలకు గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి, హైదరాబాదు జిల్లాల లారీ ఓనర్లు, విజయవాడ గాంధీనగరంలోని వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయంలో శ్రీ వై తిరుపతి అధ్యక్షతను సమావేశమయి యీదిగువ తీర్మానములను యేకగ్రీవముగా ఆమోదించిరి.

## తీర్మానములు

1. లారీలకు నేషనల్ హైవేస్ రకపు లోడు కెపాసిటీ, రాష్ట్ర హైవేసు మీద మరొక లోడు కెపాసిటీ వుండుటవల్ల లారీలు లోడ్లుతో తిరుగుటకు బొత్తిగా వీలులేకుండా వున్నది గనుక నేషనల్ అండ్ రాష్ట్ర హైవేస్ అనేది లేకుండా లారీ కెపాసిటి ప్రకారం అన్ని రోడ్లలో తిరిగేలా పర్మిట్లు యివ్వవలసిందిగా ప్రభుత్వాన్ని ఈ సభవారు కోరుతూ తీర్మానించుచున్నారు.

2. ప్రొహిబిటెడ్ రోడ్సు అంటూ కొన్ని రోడ్లమీద ఆర్. టి. సి. ప్రయివేటు బస్సులు తిరుగుతూవున్నా లారీలను పోనివ్వక పోవడం వల్ల లారీ ట్రాన్సుపోర్టుకు చాలా నష్టం వస్తున్నది గనుక ఆర్ టి సి. బస్సులు తిరిగే అన్ని రోడ్లమీద లారీలు తిరిగేలా ఉత్తర్వులు ఇప్పించవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుతూ ఈసభవారు తీర్మానించుచున్నారు.

3. ప్రతి ముఖ్యపట్టణంలో ముఖ్యంగా హైదరాబాదు, గుంటూరు, విజయవాడ, ఏలూరు పట్టణములలో జి. యస్. టి రోడ్డుమీద లారీ

లోడుతో సహా మొత్తం కాటావేసే కాటాలు వెంటనేపెట్టి ఓవర్‌లోడ్ లేకుండా చెక్ చేయుటకు ప్రభుత్వమువారు యేర్పర్చాలని ఈ సభవారు కోరుతూ తీర్మానించుచున్నారు.

4 లోడు అంటే 4 1/2 టన్నులుగా ఈ సభవారు నిర్ణయిస్తున్నారు. ఏ లారీకిగల లోడు కెపాసిటీ ప్రకారం ఆలారీ వేసుకోవలసినదిగాను లోడు కెపాసిటీకి మించి ఏమాత్రం అదనంగా లోడు వేసుకోరాదనియు, ఈ సభవారు లారీ ఓనర్లకు, డ్రైవర్లకు హెచ్చరిక విజ్ఞప్తి చేయుచున్నారు అలా యెక్కువ లోడు వేసుకున్న లారీలమీద (ఓవర్ లోడ్ వేసుకొన్న లారీల మీద) తీవ్రమయిన చర్య తీసుకోవలసిందిగా ప్రభుత్వమును కోరుతూ తీర్మానించుచున్నారు

5 కమ్మ్యో డాడ్జి, ఫార్గో, బెడ్ ఫోడ్, బెంజి, లారీలకు 6 3/4 టన్నుల లోడు కెపాసిటి వున్నదనియు ఆ ప్రకారం లోడు వేసుకోవచ్చుననియు వేసుకోవాలని లారీ ఓనర్లను, డ్రైవర్లను ఈ సభవారు కోరుతూ తీర్మానించుచున్నారు.

6. లేలెండు లారీలు వాటి లోడ్ కెపాసిటి ప్రకారం మాత్రమే లోడు వేసుకోవలసిందిగా యీ సభవారుకోరుతూ తీర్మానించుచున్నారు.

7. రాష్ట్ర మహాసభ గుంటూరులో నవంబరు నెలాఖరులోగాగాని. లేక డిశంబరు మొదటి వారములోగాని ఏ పరిస్థితులలోను తప్పక కచ్చితంగా జరుపవలసిందిగా యీ సభవారు తీర్మానించుచున్నారు

8 1961 సంవత్సరంకుముందు మోడల్ గల అన్ని లారీలకకూడా రాష్ట్రం మొత్తం పర్మిట్లు యిప్పించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ ఈ సభవారు తీర్మానించుచున్నారు.

9 ఆంధ్రప్రదేశ్‌లో లారీల కెపాసిటీ ప్రకారం లోడ్లతో మద్రాసు రాష్ట్రంలోకి వెళ్ళే లారీలు యథేచ్ఛగా అదే లోడ్‌తో వెళ్ళి దించుటకు యెట్టి ఆటంకములూ లేకుండా ఉండేలాగు యేర్పరచవలసిందిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర, మదరాసు రాష్ట్ర ప్రభుత్వములవారిని కోరుతూ ఈ సభవారు తీర్మానించుచున్నారు

10 అన్ని జిల్లాల అన్ని ప్రాంతాల లారీ ఓనరు. యూనియన్లవారు ఓవర్‌లోడ్ లేకుండా ఉండేలా చెక్‌చేయుట, చెక్ చేయించుటకు పూనుకొనుట, ఓవరులోడ్ లేకుండా చేయాలని కోరుతూ యీ సభవారు తీర్మానించుచున్నారు

11. ఇప్పుడు సమావేశమయిన గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి, హైదరాబాదుజిల్లాలవారు ఒక సంయుక్త లోడు లిస్టును తయారుచేయుటకు నిర్ణయించుకోవడమయినది. భీమవరం వారు తయారుచేసిన లోడు లిస్టును ఈ సభవారు అంగీకరించుచున్నారు.

12. లారీ ఓనరు పరోక్షంలో ఓనరు సమ్మతిగాని, యెరుకగానిలేకుండా తన స్వంతలాభము కొరకు డ్రైవరు ప్యాసింజర్లను యెక్కించుకొన్నందుకు ఓనరుకు పనిష్‌మెంటు యివ్వడం చాలా అన్యాయం, అక్రమం గనుక అలాటి కేసులలో డ్రైవర్లమీదనే చర్యతీసుకోవలసినదిగా ఆర్. టి ఏ, ఆర్. టి. ఓ ప్రభుత్వములను కోరుతూ తీర్మానించుచున్నారు.

13 కొత్త లారీలకు టెంపరరీ పర్మిట్లు ఇచ్చు సందర్భములలో జోనల్ యాట్సుగాకుండా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మొత్తంకు పర్మిట్లు యివ్వవలసిందిగా ఆర్. టి. ఏ., ఆర్. టి. ఓ. ప్రభు

త్వములను కోరుతూ ఈ సభవారు తీర్మానించుచున్నారు.

14 ఆయా పట్టణములలో లోడు యెత్తుకొనే చోట్ల లారీ ఓనర్సు ఎసోసియేషన్‌వారు నిర్ణయించిన విరామములు యివ్వవలసినదిగా ఈ సభవారు తీర్మానించుచున్నారు.

15 ఫుల్ ఫార్వర్డు టైపు లారీలకు క్యాబిన్ సీటింగు కెపాసిటి యితర లారీలకువలెనే ముగ్గురుగా సీటింగ్ కెపాసిటి యేర్పరచవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ ఈ సభవారు తీర్మానించుచున్నారు.

16 ఈ పై తీర్మానములను ప్రభుత్వము వారికి విన్నవించి అమలు జరుపుటకుగాను ముఖ్యంగా గౌ. ఛీఫ్‌మినిష్టరు శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారు, ట్రాన్సుపోర్టు మినిష్టరు గౌ. శ్రీ గురుమూర్తిగార్ల వద్దకు డిప్యుటేషన్ వెళ్ళుటకుగాను ఈ క్రిందివారిని కమిటీగా నియమించడమయినది

1. గుంటూరు_ వై తిరపతయ్య, 2. వై. శంకరయ్య, 3. శ్రీ అల్లాబక్షు. (2) ఏలూరు_ 1 కోనే దుర్గారావు, 2. ముర్రి రాములు, 3 దోసా సత్యనారాయణ. (3) భీమవరం_ 1 గ్రంధి సత్యన్నారాయణ, 2 రావూరి శ్రీమన్నారాయణ (4) తాడేపల్లిగూడెం_ 1. ఈలు ఆంజనేయులు, 2. శీతాళం అప్పారావుగారు (5) నిడదవోలు_ 1. సత్తి సూరెడ్డిగారు, 2. మహమ్మద్ హుస్సేన్‌గారు. (6) తణుకు_ 1. కూచిపూడి సుబ్బారావు, 2. పోలిశెట్టి సుబ్బారావు (7) హైదరాబాదు_ 1. సజ్జబాయి ట్రాన్సుపోర్టు. 2. దీపక్ ట్రాన్సుపోర్టు, 3 మంగీలాల్. 4 బి. సుదర్శనం, 5 చెన్నుపాటి ట్రాన్సుపోర్టు, (8) విజయవాడ_ జి. సూర్యనారాయణ, 2 సి. హెచ్ శేషగిరిరావు, 3. పి. కేశవరావు.

17. గోదావరి ఆనకట్టమీద ఖాళీలారీలను రాకపోకలకు అనుమతించవలసినదిగా కోరుతున్నారు.

18 గోదావరి నదిలో పంటుమీద లారీలను దాటించు ఛార్జి రు .48 లు నుండి రు .25 లకు తగ్గించి లారీ ఓనర్లకు సహాయము చేయవలసిందిగా ప్రభుత్వమువారిని ఈ సభవారు కోరుచున్నారు

19. లారీల లోడింగు, అన్‌లోడింగు చేసినప్పుడు వసూలుచేయుచున్న రుసుము ఓనర్ల వద్దనుండిగాక సరుకు ఆసాముల వద్దనుంచే వసూలుచేయవలసినదిగా ఈ సభవారు తీర్మానించుచున్నారు.

20. అన్ని చెక్‌పోస్టులవద్దను యం వి ఇనస్పెక్టర్లను వేసి ఓవర్‌లోడ్ చెక్ చెయ్యవలసిందిగా కోరుతూ తీర్మానించుచున్నారు. —

# సోవియట్ దేశంలో బస్సు సర్వీసు

వి. గుర్గెనోవ్

మాస్కో నగరంలో మొట్టమొదటి ప్రయాణీకుల బస్సులను ప్రవేశపెట్టి 40 సంవత్సరాలయింది. ఆ రోజులలో మున్సిపాలిటీకి 8 బస్సులు మాత్రమే వుండేవి కజాన్‌స్కీని, బెలోరస్కీ రైలుమార్గపు కొసతో కలిపే యేడు మైళ్ళ మార్గంలో మాత్రమే అవి తిరుగుతూ వుండేవి

దాదాపు పదిసంవత్సరాలతరువాత మాస్కో భూగర్భ ప్రయాణ మార్గం నిర్మింపబడింది ట్రాలీ బస్సులు ప్రవేశపెట్టబడ్డాయి అయినప్పటికీ సోవియట్ దేశంలో బస్సులే యింకా ప్రధానమైన ప్రయాణసాధనాలుగా వుంటున్నాయి

ఉదాహరణకు బొంబాయి నగరమూ దాని పరిసరాలలో వున్నంత జనాభానే కలిగివున్న సోవియట్ లితుయేనియన్ రిపబ్లిక్‌లో ప్రతి పౌరుడూ సగటున సాలుకి 114 బస్సు ప్రయాణాలు చేస్తాడు. దాదాపు 550 మైళ్ళదూరం ప్రయాణిస్తాడు.

### నేటిపరిస్థితి

నేడు సోవియట్ దేశంలో 1300 పట్టణాలలో బస్సుసర్వీసు లున్నాయి. పట్టణ జనాభాలో నూటికి 50 మంది బస్సులలోనే ప్రయాణము చేస్తారు. మిగతా ప్రయాణీకులు యితర ప్రయాణ సాధనాలను ఉపయోగిస్తారు భూగర్భ మార్గములు, ట్రాలీ బస్సులు మొదలయిన ఆధునిక ప్రయాణసాధనాలమీద బస్సులదే పైచేయిగా వుంది. ఎందుచేతనంటే వాటికంటె బస్సు ప్రయాణంలోనే యెక్కువ లాభాలున్నాయి: బస్సు యెక్కువ త్వరగావెళ్ళడమేగాక ఎక్కువ వెసులుబాటుగా కూడా వుంటుంది. ఒక బస్సు మార్గాన్ని మార్చడం చాలా తేలిక. దానికి ప్రత్యేక యేర్పాట్లేమీ అవసరంలేదు అందువల్ల యితర ప్రయాణసాధనాలకంటె బస్సులే యెక్కువమందిని తీసుకొని పోగల్గుతున్నాయి.

### నూరుకోట్లమంది ప్రయాణీకులు:

నేడు ఒక్క మాస్కో నగరంలోనే 3,500 బస్సులున్నాయి అవి 176 మార్గాలలో నడుస్తున్నాయి. ఈ మార్గాలన్నీ కలిసి 1500 మైళ్ళ దూరంవుంటాయి సగటున ఒక్కొక్కబస్సులో 50 మంది ప్రయాణీకుల చొప్పున వుంటారని లెక్కకడితే ఆగ్రానగరపు జనాభాఅంతా కలకత్తానుంచి అమృతసర్ నగరంవరకూ ఆ బస్సులలో ప్రయాణం చేయవచ్చునన్న మాట.

1964 లో మాస్కో బస్సులు మొత్తం 100 కోట్లమంది ప్రయాణీకులనుతీసుకువెళ్ళాయి.

### ట్రెయిలర్ బస్సులు –

మాస్కోనగరపు జనాభా మద్రాసునగరపు జనాభాకు మూడురెట్లుపైగా వుంటుంది. అక్కడి బస్సులన్నీ ఖచ్చితమైన టైము ప్రకారం నడుస్తాయి ఆ టైములు ప్రయాణీకులకు కాలం వృథాకాకుండా చాలా కలిసివచ్చేటట్లు నిర్ణయించబడతాయి ఈ కార్యక్రమాన్ని తప్ప

కుండా పాటించే బస్సు డ్రైవరులకు బోనసులు కూడా యిస్తారు.

నగరంలోని బస్సుమార్గాలన్నీ ప్రయాణీకులకు వీలుగావుండేలాగ యేర్పాటు చేయబడతాయి బస్సులు నిలిచేచోట్ల యిన్‌స్పెక్టర్లు వుండి ప్రయాణీకులకు తోడ్పడుతూవుంటారు రద్దీ యెక్కువగావుండే సమయాలలో ట్రెయిలరు బస్సులు నడుపబడతాయి

### కండక్టరులు వుండరు–

సోవియట్‌బస్సులలోనూ, ట్రాములలోనూ ట్రెయిలర్ బస్సులలోను కండక్టర్లు వుండరు

విదేశస్తులకిది ఆశ్చర్యం కలిగిస్తుంది. సోవియట్‌దేశంలో యీ ప్రయాణసాధనాలన్నీ చాలాసంవత్సరాలనుండీ కండక్టర్లు లేకుండానే పని చేస్తున్నాయి. ప్రయాణీకుడు బస్సుఎక్కగానే 5 కోపెక్ నాణాలను కమ్యూటర్‌లో వేస్తాడు. దానికి అమర్చివున్న టిక్కెటు రిబ్బనునుంచి ఒక టిక్కెటు చించుకొని దగ్గరవుంచుకుంటాడు. 5 కోపెక్కులతో నగరం ఈచివరనుండి ఆచివరకు ప్రయాణం చేయవచ్చు ట్రాలీలలోఅయితే మూడుకోపెక్కులు మాత్రమే 500 గజాల దూరమయినా, 10 మైళ్ళ దూరమయినా రేటు ఒక్కటే. బస్సునిలిచిన చోటల్లా డ్రయివరు ఆస్థలంపేరు ప్రకటిస్తూ వుంటాడు బస్సులోఅమర్చబడిన లౌడ్‌స్పీకర్లద్వారా అదిప్రయాణీకులందరు వినవచ్చు. నాణాలకుబదులు పదేసి కూపనులుగల పుస్తకాలనుకూడా ప్రయాణీకులు ముందుగానే కొనివుంచుకొని ఒక్కొక్కటే ఆ కమ్యూటరులో వేసిబస్‌టిక్కెట్టునుతీసుకోవచ్చు.

### రోజుకు 19 గంటలు నడుస్తాయి.

సోవియట్‌నగరాలలో బస్సులు రోజుకి 19 గంటలు నడుస్తాయి. ఉదయం మొదటిబస్సు 5–30 గంటలకు బయలుదేరుతుంది రాత్రి ఆఖరిబస్సు ఒంటిగంటవరకు వుంటుంది శెలవుదినాలలో యింకా ఎక్కువసేపు నడుస్తాయి. కార్మికులు ఇతరఉద్యోగులు కోరితే బస్సులు ఉదయం యింకా పెందలాడేను, రాత్రియింకా ఆలస్యంగానుకూడా నడుస్తాయి సోవియట్ శాసనంప్రకారం ఒక్కొక్కడ్రయివరు రోజుకి 7 గంటలు మాత్రమే పనిచేయాలి. సగటున ఒక్కొక్క డ్రయివరుకు నెలకు 170 లేక 180 రూబుల్సు జీతం యివ్వబడుతుంది సంవత్సరానికి ఒక నెల జీతంమీద సెలవు యివ్వబడుతుంది.

పెద్ద పెద్ద సోవియట్ నగరాలలో బస్సులన్నీ సిటీ సోవియట్ అధీనంలోనే వుంటాయి.

### బస్సుమీద వెయ్యిమైళ్ళు

సోవియట్‌దేశంలో ఒకపట్టణంనుంచి మరొక పటణానికీ, ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికీ చేసే దూరప్రయాణాలుకూడా బస్సులమీద చేయవచ్చు. ఉదాహరణకు ఈ బస్సులలో మాస్కోనుంచి క్రిమియావరకూ, కకేసస్‌వరకూ ఉజ్బెకిస్థాన్‌నుంచి కిర్గీజియా, కజకస్థాన్‌వరకూ ప్రయాణంచేయవచ్చు ఈ బస్సు మార్గాలు ఆర్మీనియా, జార్జియా, అజెర్‌బైజాన్ రాష్ట్రాలను, సోవియట్ కేంద్ర రాష్ట్రాలతో కలుపుతున్నాయి. వీటిలోకొన్ని వెయ్యిమైళ్ళ దూరం కూడా వున్నాయి

దూరప్రయాణాలుచేసే ప్రయాణీకుల సౌకర్యార్థం అవి ఆగేచోట్ల ప్రత్యేక ప్లాట్‌ఫారాలు నిర్మించబడ్డాయి ఆ ప్లాట్‌ఫారాలమీద హోటళ్ళు, పోస్టాఫీసులు, స్నానాలయేర్పాట్లు, చిన్నపిల్లలకు తల్లులకూ ప్రత్యేకగదులూ మొదలైన యేర్పాట్లుంటాయి.

తెలంగాణా డిప్యూటీ రవాణా కమీషనరు శ్రీ పి. యస్. రాజగోపాలరాజు బి ఏ., బి.ఎల్. గారి

టూరు కార్యక్రమము

| తేది | వివరములు |
|---|---|
| 8—11—1965 | ఉదయమున జహీరాబాద్ పోవుదురు. జహీరాబాద్ చెక్‌పోస్టును తనిఖీచేసి సంగారెడ్డి వెళ్ళి నిలచిపోవుదురు. |
| 9—11—65 | ఉదయము పిట్లామునకు పోవుదురు. అచ్చటి చెక్‌పోస్టును తనిఖీచేసి నిజాంసాగరునకు పోయి అచ్చట నిలచెదరు |
| 10—11—65 | ఉదయము బయలుదేరి హైదరాబాదు తిరిగి చేరుదురు. |
| 17—11—65 | మధ్యాహ్నము తదుపరి ఖమ్మమునకు పోవుదురు. |
| 18...11—65 | నల్లగొండకు మధ్యాహ్నము పోవుదురు. స్థానిక రవాణా ఆఫీసరు కచేరీలో తనిఖీ జరుపుదురు. |
| 20—11—65 | మధ్యాహ్నము హైదరాబాదునకు తిరిగి పోవుదురు. |
| 24—11 65 | ఉదయమున నిజామాబాదునకు పోవుదురు |
| 25—11—65 నుండి 26—11—65 వరకు | స్థానిక రవాణా ఆఫీసర్ కచేరీలో డి. సి. బి. రిజిస్టరులను, యెన్‌ఫోర్సుమెంటు వస్తువులను తనిఖీ చేయుదురు. |
| 27—11—65 | ఉదయమున హైదరాబాదునకు తిరిగి పోవుదురు |

— తెలంగాణా డిప్యూటీ రవాణా కమీషనర్ – హైదరాబాద్

## —: రైల్వే సిబ్బంది కర్తవ్య పరాయణత :—

ఒకవైపున పాకీస్తానీ సైనికులు గుళ్ళవర్షము కురిపిస్తున్నా ప్రాణాలనుసహితం తెగించి భారత రైల్వే సిబ్బంది యెలా తమ విధులను నిర్వహించిందో యిప్పుడు తెలియవచ్చింది. సైనికులకు సాధనసామగ్రులు అందడంలో అంతరాయము లేకుండా వారు రైలుబళ్ళను నడిపి కర్తవ్యపరాయణతను ప్రకటించుకున్నారు.

1965 సెప్టెంబరు 9 వ తేదీన ఒక ప్రత్యేక గూడ్సుబండి డ్రయివరు గాద్రా రోడ్డు స్టేషను ఔటర్ సిగ్నలువద్ద శత్రువుల కాల్పులకు గురి అయి గాయపడ్డాడు. ఎంతోలేని ఆబాధను ఓర్చుకుంటూ విధినిర్వహణే పరమలక్ష్యంగా అతను ఆ బండిని గమ్యానికి తీసుకుపోయి సైనికులకు అత్యంతావసరమయిన్న సాధనసామగ్రులను అందజేశాడు. తోటి పనివారికి యెంతో ఆదర్శంగా నిలిచాడు.

సెప్టెంబరు 8, 22 తేదీలమధ్య గాద్రా రోడ్డు స్టేషనుపై శత్రుసేనలు బాంబులు వేశాయి. రవాణా మార్గాలు ధ్వంసమయినాయి. అయినా అసిస్టెంటు స్టేషను మాష్టరు, మెహార్ నూర్ ఖాతా గగారియానుం గాద్రా రోడ్డు వరకూ తొమ్మిదిమైళ్ళ పైచిలుకు దూరం కాలినడకన పోయి రవాణా సౌకర్యాలు త్వరితంగా పునరుద్ధరించేందుకు దోహదం చేశారు.

బార్మర్‌లో ప్రత్యేక డ్యూటీపై పర్మనెంటు వే యిన్‌స్పెక్టరుగా పనిచేస్తున్న శ్రీ చాతన్ రామ్‌ను 1965 సెప్టెంబరు 11 వ తేదీనుంచి గాద్రా రోడ్డుకు బదిలీ చేశారు. గాద్రా రోడ్డుపై శత్రుసేనలు నిరంతరంగా కాల్పులు సాగిస్తున్నా ఈయన తన ప్రాణాలను సహితం లెక్కచేయక రైలు మార్గంలో తిరుగుతూ రైలుమార్గం రక్షణకు, సిబ్బందిసంక్షేమానికి యేర్పాటుచేశారు. సైనికుల కవసరమయిన సాధన సామగ్రులను చేరవేసే ప్రత్యేకరైళ్ళు నిరాఘాటంగా నడవటానికి ఆయన కృషి కారణం. అంతేకాదు, రైలుమార్గం సరిగా వుందో లేదో చూచేందుకు యుద్ధరంగందాకా కూడా వెళ్ళి విధులు నిర్వహించారు. నీరుదొరకని ఆ యెడారి ప్రాంతంలో సైనికులకు మంచినీరు చాలినంతగాఅందించారు కూడాను.

ఫిరోజ్‌పూర్ కంటోన్‌మెంటులో లోకో షెడ్డుపై సెప్టెంబరు 8 వ తేదీన పాకీస్తానీ విమానాలు బాంబులు వేశాయి. తత్ఫలితంగా రైలు యింజనుల షెడ్డు, చమురు గోదాములు అగ్నికాహుతయ్యాయి. రైలుమార్గము, రైల్వే కర్మాగారాలు కూడా దెబ్బతిన్నాయి. ఆ సమయంలో అక్కడేవున్న లోకోషెడ్ ఉద్యోగి తిలక్ రాజ్ ఖన్నా తనకు గాయాలు తగిలినా లెక్కచేయక నిప్పు ఆర్పేందుకు యేర్పాట్లు చేశారు. చమురు, పెట్రోలుడబ్బాలను అక్కడినుంచి క్షణాలమీద తరలించారు. శత్రువిమానాలు పయిన తిరుగుతున్నా, గాయాలతో తను బాధపడుతున్నా లెక్కచేయక నిరుపమ కర్తవ్యపరాయణతను ప్రదర్శించారు. ఈయన యింత సాహసంగా విధులను నిర్వహించకుండా వున్నట్లయితే యింకా యెంతో హెచ్చునష్టం కలిగివుండేది. లోకోషెడ్ ధ్వంసంఅయిపోయి వుండేది. ఆరాత్రి అంతా, ఆ మరునాడు శత్రు

# మోటారు బండ్లనుగూర్చి సాధారణముగా తెలియని విషయములు

### మీకు తెలుసునా?

1 బ్రిటిష్‌పార్లమెంటు 1896లో మోటారు బండి రోడ్డునపోవుచుండగా బండీముందు దాని తాలూకు మనిషి పరిగెత్తుచూ గంటమ్రోగించ నవసరములేదని ఉత్తరువుచ్చేసినప్పుడున కలిగింది మోటారుపరిశ్రమకు విముక్తి ఇదిజరిగి 70సంవత్సరముల లోపే అని,

2. ప్రపంచములో నేడురోడ్ల పైపోవుమోటారు బండ్లు, మోటారు సైకిళ్ళు, స్కూటర్లు,మూడు చక్రముల బండ్లు కాక 16 కోట్ల 80 లక్షలున్నవి అని,

3. ఈ 16 కోట్ల 80 లక్షలలో ఇండియాలోని మోటారుబండ్ల సముదాయము 0 7 మిలియన్లు అని,

4 ప్రస్తుతము ప్రపంచములో సాలీనా తయారగుచున్న కార్లు, జీపులు, లారీలసంఖ్య 2 కోట్ల 20 లక్షలు చొప్పున అని,

5. ప్రతియేటా యిండియాలో 0 969 చొ॥ కారులు, జీపులు, లారీలు తయారుచేయబడుచున్నవి అని,

6. తయారుచేయబడుచున్న కార్ల సంఖ్యకును లారీల సంఖ్యకును సంబంధము సంయుక్త రాజ్యములో (యింగ్లండు, స్కాట్లెండు, అయిర్లెండులలో) 4:1 కెనడాలో 5:1 ఫ్రాన్సులో 7:1 పశ్చిమజర్మనీలో 10:1 సంయుక్త రాష్ట్రములలో 5:1 అని,

7. కార్లయొక్కయు, లారీలయొక్కయు నిర్మాణపు సంఖ్యల సంబంధము 1:1 గానున్న

---

కాల్పులను లెక్కచేయక ఆయన అక్కడేవుండి విధులను నిర్వహించారు తోటి సిబ్బందికి ఆదర్శప్రాయు లయ్యారు.

సెప్టెంబరు 8 వ తేదీన సైనిక దళానికి చెందిన ఒక టాంకును రైలు బండిలోంచి దించి సార్నా స్టేషనులోంచి బయటకు తీస్తూవుంటే రోడ్డు గట్టుపడింది టాంకుకు నిప్పంటుకుంది. సార్నా స్టేషను మాష్టరు జయదేవ్ శర్మ తక్షణమే అక్కడకుపోయి ఆ రైలుబండిలో తక్కిన పెట్టెలను వేరుచేసి నష్టాన్ని చాలావరకు తగ్గించారు

ఈయన సుమారు 36 గంటలు నిద్రాహారాలు మాని ఆ స్టేషనునే అంటిపెట్టుకొని కూర్చొని సైనికులకు సరుకులు చేరవేసే రైళ్ళు అంతరాయంలేకుండా వచ్చేందుకు దోహదం చేశారు

ఇలాంటి సాహసగాధ లెన్నో వున్నాయి. ప్రాణాలనుకూడా తెగించి రైల్వేసిబ్బంది రైలు మార్గాలను కాపాడుతూ రైలుబళ్లు నిరంతరాయంగా ప్రయాణం చేసేందుకు యెనలేని దోహదము చేశారు.

ప్రపంచములోని అల్పసంఖ్యాకులయిన దేశములలో యిండియా యొకటి అని.

8 1963 లో జెకోస్లోవేకియా లో తయారు చేయబడిన కార్లయొక్కయు, లారీలయొక్కయు మొత్తపు సంఖ్య 80,000 అనియు ఈ సంవత్సరములో యిండియాలో తయారగునట్టి వాటి సంఖ్య అంతవరకును పెరుగగలదని యూహించబడినది.

9. అమెరికన్ సంయుక్తరాష్ట్రముల బడ్లు తయారుచేయు పరిశ్రామికులు చిన్నకార్లను (వారి దృష్టిలో చిన్నకార్లనబడునవి మనకు మాధ్యరకపు కార్లుగా నుండును) ఇవి సాలుకు 4లక్షల వరకు కొనుగోలు జరుగుచున్నను తయారు చేయరు.

10. పైన ఉదహరింపబడినదానివలన అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రకారము కార్ల నిర్మాణపు టార్థికసంపద సాలునకు 4లక్షలను మించి యుండునని అర్థమగుచున్నది, లేక ధ్వనించుచున్నది అని.

11. గాలిపూరణపు టైరులను జె బి డన్ లప్ కనిపెట్టి పూర్తిగా 77 సంవత్సరములైనదో లేదో అని.

12. మొదటిసారిగా యిండియాలో నిరోడ్లపై మోటారుబండి నడిపింపబడినది. 1897వ సంవత్సరములో అని

13. మొట్టమొదట ప్రాతిపదికను పొందిన మోటారుబండి కాంపొనెంట్ స్ప్రాకడర్ వాల్వ్ కోర్. 1898లో ఈ అయిటము ఒక ప్రమాణపు నిర్ధారణ కంపైల్ చేయబడినది. ఈ గడచిన 67 వత్సరములలోను ఈ నిర్ధారణయం దెట్టి మార్పును చేయబడలేదు. అనగా 1898 లోని వాల్వ్ కోర్ ఈనాటి వాల్వ్ కోరునకు బదులు వాడవచ్చును అని.

14 డ్రిల్లెస్స్, రెక్సైన్ మొదలగు అనేక మాటలు బండ్లను తయారుచేయు పిల్కింగ్ టన్, అ యి సి అయి మొదలగు యజమానుల పేర్లనియు యిట్టి పేర్లు తదితర తయారు చేయు ఖామందులచే వుపయోగింపబడిన పేటెంట్, కాపీరైట్ల చటముల అతిక్రమణ అని

15. నీ వేదయిన కొండపైనుండి కిందికి దిగునప్పుడు నీవు ఆ కొండనే యెక్కుచున్నచో ఏ గేరులోనుండి బండిని నడుపుదువో అదే గేరులో నుండి దిగవలెనని

16. నీళ్ళయందుగాని, వరదతగిలిన వీధియందుగాని బండిని నడిపించినపిదప బ్రేక్ లైనరు నీళ్ళలో నానుటచే మెత్తపడి గమననిరోధకములు పనిచేయవనియు కారు నీటినుండిగాని, అట్టి వీధినుండిగాని ఈవలకువచ్చిన వెంటనే చేతిగమన నిరోధకము కొంత యుపయోగించుటచే క్రమేపీ మిగతా బ్రేకులు పనిచేయును.

17. న్యూయార్కు రాష్ట్రములోని మోటారు బండ్ల చట్టము ప్రకారము 8 సంవత్సరముల వాడుక దాటిన బండ్లు లైసెన్సుపొందిన స్టేషను వల్ల తనిఖీ చేయబడవలయునని

18. పైన ఉదహరించిన తనఖా వ్యాపారపు బండ్ల (లారీల)విషయముననే గాక స్వంతబండ్లకు కూడ అమలుజరుపబడుచున్నవి.

19. అమెరికా సంయుక్త రాష్ట్రములలో జరుగుచున్న కారుప్రమాదాలు కొంత కారణముగా కనుమాపులోపమువలన కలుగుచున్న

వను సిద్ధాంతమునననుసరించి ఛాఫర్లు, లారీ డ్రైవరులు న్యూయార్కు రాష్ట్రములో చట్టము ప్రకారము 9 సంవత్సరముల కొకమారు తమ కండ్లదృష్టిని పరిశీలన చేయించుకొనవలెను అని.

## మోటారు బండ్లవారికి సలహాలు

మోటారుబండ్లపై దీపములపై విధించిన నిబంధనలవిషయమైన ప్రచురణనుపసంహరించు కొన్నను మోటారుబండ్ల యజమానులు తల కట్టు దీపపు పైసగ భాగమునకును రంగుపూయ వలసినదిగా అధికారులవల్ల సంఘా లివ్వబడు చున్నారు. ఇందువలన రాత్రులయందు బండి నడుపుట నిరపాయకరముగ నుండును

### మోటారిస్టులకు ఏ. బి. సి. లు

ఎ గమననిరోధకములనువిజ్ఞానముతోడను, విచక్షణాజ్ఞానముతోడను ముందుగా ఉపయోగించుము

బి బండినడుపుచున్నప్పుడు సిద్ధముగాను, చురుకుగాను, యేకాగ్రతగాను నుండుము

సి. నిన్నును, యితరులను నష్టపడనుండియు, ప్రమాదమునుండియు ముందు హెచ్చరిక, జాగ్రతయు రక్షించును

డి బండిని నెమ్మదిగను, స్థిమితముగాను, కుదుపులు లేకుండగను, సఫలముగాను (సమర్థత తోను) నడుపవలెను.

ఇ. చక్రములపై అదుపునుకలిగి రోడ్డుపై జాగరూకతతో మెలగుము.

ఎఫ్. సరియయిన దారివెంటపొమ్ము డ్రయివింగు సంజ్ఞలను మరువకుము.

జి. మూలలు, వంపులు, మలుపుల రాక పోకలమధ్య బండుపోనిస్థలముల చుట్టునూ నెమ్మదిగా వెళ్ళుము

హెచ్ వీధిమూలలందునిలిపి మరీపోనిమ్ము పాఠశాలలున్న ప్రదేశములచుట్టును వేగిరింపవద్దు

ఐ నీయందు ధైర్యము నెలకొల్పుకొనుము. ఇతరులకు భీతిని కలుగజేయకుము

జె. జనసమ్మర్దముగు రహదారిపై సరదాగా బండిలో పోవుటకుండిన నడకకంటె మరేమియు మంచిది కాదు.

కె కనీసము మిక్కుటముగా జనసమ్మర్దముండెడి గంటలయందైనను రాకపోకలవత్తిడి నుండు రహదారులకు దూరముగానుండుము.

ఎల్ రాకపోకల క్రొత్త నిబంధనలను తెలిసికొనుము యేదయిన కొనుగోలునకు నీవు పోవునపుడు కారునకు తాళము వేయుము.

యమ్ నీ బండిని మంచిస్థితిలో నుంచుము. దానినితరులకు ఆదర్శ ప్రాయముగ వుంచుము.

యన్ పొరబాట్లుచేయు డ్రయివర్లను గుర్తుపెట్టుకొని వెంటనే ట్రాఫిక్ పోలీసునకు రిపోర్టు చేయుము

ఓ రహదారి నిబంధనలను విధేయుడవయి అనుసరించుము అది సరిఅయినది, న్యాయమయినది, నిర్దుష్టమైనది అయిననేగాని ముందు బండిని దాటిపోవద్దు

పి సరియైన ప్రదేశమందు బండిని నిలిపియుంచుము మన రోడ్డు సంజ్ఞలను ప్రదర్శించుము

క్యూ, నిన్ను భ్రమప్రమాదముల నుండి కాపాడునది త్వరితమయిన నిర్ణయము లేగాని తొందరబాటువి కావు.

ఆర్. రహదారులపై వెనుకకు నడుపుట భ్రష్టదాయకము, నిర్లక్ష్యముగా నడుపుట ప్రాణాంతకమగును.

యస్. తప్పిదారిన వచ్చి-ప్పటికిని పాదచారుని కాపాడుము.

టి. ఇతర డ్రయివరులకు రోడ్డును సరియైన తీరున ఉపయోగించుటను నేర్పుము.

యు. అవసరమయినచో హారన్ను నుపయోగించుము కాని విరామములేకుండగను, వినజాలని తీరున ప్రయోగించకుము

వి వెంట్రు ఎ వెంట్రి టాపీ వెంట్రి

డబ్ల్యు. రోడ్డుప్రక్కలనుండు కార్మికులు నీ మోటారుబండిని పాడుచేయుదురు.

ఎక్స్. సరిఅయిన కర్మాగారమునందు నీ కారును ఎక్స్ రేఖాయాపటమును తీయించుము రీట్రేడ్ గాని, రీబోరునుగాని మరమ్మతును చేయించుటకు వెనకాడకుము

వై. అవతల రోడ్డు మరమ్మతులో నున్నది. నీవు తిన్నగా వెళ్ళినచో ప్రమాదము.

జడ్. వంకరటింకర్లుగా (మెలికలు మెలికలుగా) బండిని నడుపుట విపత్కరము జీబ్రా అడ్డరోడ్లను (ట్రాఫిక్ పోలీసులేని) రోడ్డు గురులును సకారణముగనే నిన్ను నిలుపుచేయును.

## కిరోసిన్ నూనెవల్ల నడుపబడు కార్లు

కెయిరో వార్తాపత్రిక ప్రకారము కెరోసినాయిలుచే మోటారు బండ్లు నడుపబడు తంత్రము యుక్త అభివృద్ధిచేయబడి తృప్తికరముగా ఫలవంతమగు ప్రయత్నములు జపానులో చేయబడినవి. టోకియోలోని మోటారుబండ్ల పారిశ్రామిక పరిశోధనా సంస్థచే అభివృద్ధి చేయబడిన ఈ యుపాయము కెరోసిన్‌ను 160 సెంటిగ్రేడులో ఆవిరిరూపము పొందుటకు సాధ్యమగునట్లు చేయును ఈ ఉపాయము నవలంబించుచున్న సుమారు 60 టాక్సీలు అందువల్ల తృప్తికరముగానే పనిచేయుచున్నట్లు తెలియపరచుచున్నారు. ఈ యుక్త నభివృద్ధి చేసినవారి ప్రకారము యీ పద్ధతియందున్న ఒక్కటే లోపము యింజన్ శక్తిలో కొద్దిపాటి తగ్గుదల కలుగును. ఇప్పుడు ఈవిధానము ననుసరించుటకు రు. 655 లు ఖర్చగును.

## పాదచారుల రాకపోకల సంజ్ఞలు చూపించబడుచున్నవి-

మొదటిసారిగా పాదచారులచే పనిచేయించబడు దీపపుసంజ్ఞ కేల్పాక్ వైద్యకళాశాల సమీపములోని పూనమల్లె హైరోడ్ వద్ద స్థాపించబడినది, పనిచేయుచున్నది.

ఈ సంజ్ఞ పాదచారుడొక గుండీని అదిమినచో పనిచేసి కొంచెముసేపయినపిదప తగ్గిపోవును తిరిగి అది కొద్ది సెకండ్లయినతదుపరికే పనిచేయును ఈలోగా యితరవిధములగు రాకపోకలకు సావకాశమునిచ్చును.

## కేలికట్‌లో వాటంతటవి పనిచేయు ట్రాఫిక్ లైట్లు

14వ సెప్టెంబరు 65న కేలికట్‌నందు పాలయం రోడ్డు కూడలివద్ద మొదటిసారిగా వాటియంతట అవి పనిచేయు ట్రాఫిక్ లైట్ల ఉపయోగము ప్రారంభింపబడినది.

# మోటారు బండ్లనుగూర్చి సాధారణముగా తెలియని విషయములు

### మీకు తెలుసునా?

1 బ్రిటిష్ పార్లమెంటు 1896లో మోటారు బండి రోడ్డునపోవుచుండగా బండీముందు దాని తాలూకు మనిషి పరిగెత్తుచూ గంట మ్రోగించ నవసరము లేదని ఉత్తరువు చేసినరోజున కలిగింది మోటారుపరిశ్రమకు విముక్తి. ఇదిజరిగి 70సంవత్సరముల లోపే అని,

2. ప్రపంచములో నేడు రోడ్లపై పోవు మోటారు బండ్లు, మోటారు సైకిళ్ళు, స్కూటర్లు, మూడు చక్రముల బండ్లు కాక 16 కోట్ల 80 లక్షలున్నవి అని,

3. ఈ 16 కోట్ల 80 లక్షలలో ఇండియాలోని మోటారుబండ్ల సముదాయము 0 7 మిలియన్లు అని,

4 ప్రస్తుతము ప్రపంచములో సాలీనా తయారగుచున్న కార్లు, జీపులు, లారీలసంఖ్య 2 కోట్ల 20 లక్షలు చొప్పున అని,

5. ప్రతియేటా యిండియాలో 0 968 చొ॥ కారులు, జీపులు, లారీలు తయారుచేయబడుచున్నవి అని,

6. తయారుచేయబడుచున్న కార్ల సంఖ్యకును లారీల సంఖ్యకును సంబంధము సంయుక్త రాజ్యములో (యింగ్లండు, స్కాట్లండు, అయిర్లాండులలో) 4:1 కెనడాలో 5:1 ఫ్రాన్సులో 7:1 పశ్చిమజర్మనీలో 10:1 సంయుక్త రాష్ట్రములలో 5:1 అని,

7. కార్లయొక్కయు, లారీలయొక్కయు నిర్మాణపు సంఖ్యల సంబంధము 1:1 గానున్న

---

కాల్పులను లెక్కచేయక ఆయన అక్కడేవుండి విధులను నిర్వహించారు తోటి సిబ్బందికి ఆదర్శప్రాయులయ్యారు.

సెప్టెంబరు 8వ తేదీన సైనిక దళానికి చెందిన ఒక టాంకును రైలు బండిలోంచి దించి సార్నా స్టేషనులోంచి బయటకు తీస్తూవుంటే రోడ్డు గల్లుపడింది టాంకుకు నిప్పంటుకుంది. సార్నా స్టేషను మాష్టరు జయదేవ్ శర్మ తక్షణమే అక్కడకుపోయి ఆ రైలుబండిలో తక్కిన పెట్టెలను వేరుచేసి నష్టాన్ని చాలావరకు తగ్గించారు

ఈయన సుమారు 36 గంటలు నిద్రాహారాలు మాని ఆ స్టేషనునే అంటిపెట్టుకొని కూర్చొని సైనికులకు సరుకులు చేరవేసే రైళ్ళు అంతరాయంలేకుండా వచ్చేందుకు దోహదం చేశారు

ఇలాంటి సాహసగాథ లెన్నో వున్నాయి. ప్రాణాలనుకూడా తెగించి రైల్వేసిబ్బంది రైలుమార్గాలను కాపాడుతూ రైలుబళ్లు నిరంతరాయంగా ప్రయాణం చేసేందుకు యెనలేని దోహదము చేశారు.

ప్రపంచములోని అల్పసంఖ్యాకులయిన దేశములలో యిండియా యొకటి అని,

8 1963 లో జెకోస్లోవేకియా లో తయారు చేయబడిన కార్లయొక్కయు,లారీలయొక్కయు మొత్తపు సంఖ్య 80,000 అనియు ఈ సంవత్సరములో యిండియాలో తయారగునట్టి వాటి సంఖ్య అంతవరకును పెరుగగలదని యూహించబడినది.

9. అమెరికన్ సంయుక్తరాష్ట్రముల బండ్లు తయారుచేయు పరిశ్రామికులుచిన్నకార్లను(వారి దృష్టిలో చిన్నకార్లనబడునవి మనకు మధ్యరకపు కార్లుగా నుండును) ఇవి సాలుకు 4లక్షల వరకు కొనుగోలు జరుగుచున్నను తయారు చేయరు.

10. పైన ఉదహరింపబడినదానివలన అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రకారము కార్ల నిర్మాణపు టార్థికసంపద సాలునకు 4లక్షలను మించి యుండునని అర్థమగుచున్నది, లేక ధ్వనించుచున్నది అని.

11. గాలిపూరణపు టైరులను జె బి డన్లప్ కనిపెట్టి పూర్తిగా 77 సంవత్సరములైనదో లేదో అని.

12. మొదటిసారిగా యిండియాలోవిరోడ్లపై మోటారుబండి నడిపింపబడినది. 1897వ సంవత్సరములో అని

13. మొట్టమొదట ప్రాతిపదికను పొందిన మోటారుబండి కాంపొనెంట్ స్టాండర్ వాల్వ్ కోర్. 1898లో ఈ అయిటము ఒక ప్రమాణపు నిర్ధారణ కంపైల్ చేయబడినది. ఈ గడచిన 67 వత్సరములలోను ఈ నిర్ధారణయందెట్టి మార్పును చేయబడలేదు. అనగా 1898 లోని వాల్వ్ కోర్ ఈనాటి వాల్వ్ కోరునకు బదులు వాడబడును అని

14 డ్రిప్లెక్సు, రెక్సైన్ మొదలగు అనేక మాటలు బండ్లను తయారుచేయు పిల్కింగ్టన్, అ యి సి అయి మొదలగు యజమానుల పేర్లనియు యిట్టి పేర్లు తనితర తయారు చేయు ఖామందులచే వుపయోగింపబడిన పేటెంట్, కాపీరైట్ల చటముల అతిక్రమణ అని

15. నీవేదయిన కొండపైనుంచి కిందికి దిగునప్పుడు నీవు ఆ కొండనే యెక్కుచున్నచో ఏ గేరులోనుండి బండిని నడుపుదువో అదే గేరులో నుండి దిగవలెనని

16. నీళ్ళయందుగాని, వరదతగిలిన వీధియందుగాని బండిని నడిపించినపిదప బ్రేక్ లైనరు నీళ్ళలో నానుటచే మెత్తపడి గమననిరోధకములు పనిచేయవనియు కారు నీటినుండిగాని, అట్టి వీధినుండిగాని ఈవలకువచ్చిన వెంటనే చేతిగమన నిరోధకము కొంత యుపయోగించుటచే క్రమేపీ మిగతా బ్రేకులు పనిచేయును.

17. న్యూయార్కురాష్ట్రములోని మోటారు బండ్ల చట్టము ప్రకారము 8 సంవత్సరముల వాడుకదాటిన బండ్లు లైసెన్సుపొందిన స్టేషను వల్ల తనిఖీచేయబడవలయునని

18. పైన ఉదహరించిన తనఖా వ్యాపారపు బండ్ల (లారీల)విషయమునన్నే గాక స్వంతబండ్లకు కూడ అమలుజరుపబడుచున్నవి.

19. అమెరికా సంయుక్త రాష్ట్రములలో జరుగుచున్న కారుప్రమాదాలు కొంత కారణముగా కనుచూపులోపమువలన కలుగుచున్న

వను సిద్ధాంతమునననుసరించి ఛాఫర్లు, లారీ డ్రైవరులు న్యూయార్కు రాష్ట్రములో చట్టము ప్రకారము 9 సంవత్సరముల కొకమారు తమ కండ్లదృష్టిని పరిశీలనచేయించుకొనవలెను అని.

## మోటారు బండ్లవారికి సలహాలు

మోటారుబండ్లపై దీపములపై విధించిన నిబంధనలవిషయమైన ప్రచురణనుపసంహరించు కొన్నను మోటారుబండ్ల యజమానులు తల కట్టు దీపపు పైనగభాగమునకును రంగుపూయ వలసినదిగా అధికారులవల్ల సూచనలివ్వబడు చున్నారు. ఇందువలన రాత్రులయందు బండి నడుపుట నిరపాయకరముగ నుండును

## మోటారిస్టులకు ఏ. బి. సి. లు

ఎ గమననిరోధకములనువిజ్ఞానముతోడను, విచక్షణాజ్ఞానముతోడను ముందుగా ఉపయోగించుము

బి బండినడుపుచున్నప్పుడు సిద్ధముగాను, చురుకుగాను, యేకాగ్రతగాను నుండుము

సి. నిన్నును, యితరులను నష్టమునుండియు, ప్రమాదమునుండియు ముందు హెచ్చరిక, జాగ్రతయు రక్షించును

డి బండిని నెమ్మదిగను, స్థిమితముగాను, కుదుపులు లేకుండగను, సఫలముగాను (సమర్థతతోను) నడుపవలెను.

ఇ. చక్రములపై అదుపునుకలిగి రోడ్డుపై జాగరూకతతో మెలగుము.

ఎఫ్. సరియయిన దారివెంటపొమ్ము డ్రయివింగు సంజ్ఞలను మరువకుము.

జి. మూలలు, వంపులు, మలుపుల రాకపోకలమధ్య బండిపోనిస్థలములచుట్టునూ నెమ్మదిగా వెళ్ళుము.

హెచ్ వీధిమూలలందునిలిపి మరిపోనిమ్ము పాఠశాలలున్న ప్రదేశములచుట్టును వేగిరింపవద్దు

ఐ నీయందు ధైర్యము నెలకొల్పుకొనుము. ఇతరులకు భీతిని కలుగజేయకుము

జె. జనసమ్మర్దముగు రహదారిపై సరదాగా బండిలో పోవుటకుండిన నడకకంటె మరేమియు మంచిది కాదు.

కె కనీసము మిక్కుటముగా జనసమ్మర్దముండెడి గంటలయందైనను రాకపోకలవత్తిడినుండు రహదారులకు దూరముగానుండుము.

ఎల్ రాకపోకల క్రొత్త నిబంధనలను తెలిసికొనుము యేదయిన కొనుగోలునకు నీవు పోవునపుడు కారునకు తాళమువేయుము.

యమ్ నీ బండిని మంచిస్థితిలో నుంచుము. దానినితరులకు ఆదర్శ ప్రాయముగ వుంచుము.

యన్. పొరబాట్లుచేయు డ్రయివర్లను గుర్తుపట్టుకొని వెంటనే ట్రాఫిక్ పోలీసునకు రిపోర్టుచేయుము

ఓ రహదారి నిబంధనలను విధేయుడవయి అనుసరించుము అది సరిఅయినది, న్యాయమయినది, నిర్దుష్టమైనది అయిననేగాని ముందు బండిని దాటిపోవద్దు

పి. సరియైన ప్రదేశమందు బండిని నిలిపియుంచుము మన రోడ్డు సంజ్ఞలను ప్రదర్శించుము

క్యూ నిన్ను భ్రమప్రమాదముల నుండి కాపాడునవి త్వరితమయిన నిర్ణయములేగాని తొందరబాటువి కావు.

ఆర్. రహదారులపై వెనుకకు నడుపుట ప్రమాదాయకము, నిర్లక్ష్యముగా నడుపుట ప్రాణాంతకము కూడను.

యస్. తప్పిదారిన వచ్చిప్పటికిని పాదచారుని కాపాడుము.

టి. ఇతర డ్రయివరులకు రోడ్డును సరియైన తీరున ఉపయోగించుటను నేర్పుము.

యు. అవసరమయినచో హారన్ను నుపయోగించుము కాని విరామములేకుండగను, వినజాలని తీరున ప్రయోగించకుము

వి. వెంట్రుక వెంట్రుక టాపీ వెంట్రుక

డబ్ల్యు. రోడ్డుప్రక్కలనుండు కార్మికులు నీ మోటారుబండిని పాడుచేయుదురు.

ఎక్స్. సరిఅయిన కర్మాగారమునందు నీ కారును ఎక్స్‌రేఖాయాపటమును తీయించుము రీట్రేడ్‌గాని, రీబోరునుగాని మరమ్మతును చేయించుటకు వెనకాడకుము

వై. అవతల రోడ్డు మరమ్మతులో నున్నది. నీవు తిన్నగా వెళ్ళినచో ప్రమాదము.

జడ్. వంకరటింకరగా (మెలికలు మెలికలుగా) బండిని నడుపుట విపత్కరము జీబ్రా అడ్డరోడ్లను (ట్రాఫిక్ పోలీసులేని) రోడ్డు గుర్తులను సకారణముగనే నిన్ను నిలుపుచేయును.

### కిరోసిన్ నూనెవల్ల నడుపబడు కార్లు

కైయిరో వార్తాపత్రిక ప్రకారము కిరోసినాయిలుచే మోటారు బండ్లు నడుపబడు తంత్రము యొక్క అభివృద్ధిచేయబడి తృప్తికరముగా ఫలవంతమగు ప్రయత్నములు జపానులో చేయబడినవి. టోకియోలోని మోటారుబండ్ల పారిశ్రామిక పరిశోధనా సంస్థచే అభివృద్ధి చేయబడిన ఈ యుపాయము కిరోసిన్‌ను 160 సెంటిగ్రేడులో ఆవిరిరూపము పొందుటకు సాధ్యమగునట్లు చేయును. ఈ ఉపాయము నవలంబించుచున్న సుమారు 60 టాక్సీలు అందువల్ల తృప్తికరముగానే పనిచేయుచున్నట్లు తెలియపరచుచున్నారు. ఈ యుక్తి నభివృద్ధి చేసినవారిప్రకారము యీ పద్ధతియందున్న ఒక్కటే లోపము— యింజన్‌శక్తిలో కొద్దిపాటి తగ్గుదల కలుగును. ఇప్పుడు ఈవిధానము ననుసరించుటకు రు. 655 లు ఖర్చగును.

### పాదచారుల రాకపోకల సంజ్ఞలు చూపించబడుచున్నవి—

మొదటిసారిగా పాదచారులచే పనిచేయింపబడు దీపపుసంజ్ఞ కేల్పాక్ వైద్యకళాశాల సమీపములోని పూనమల్లె హైరోడ్ వద్ద స్థాపించబడినది, పనిచేయుచున్నది.

ఈ సంజ్ఞ పాదచారు డొక గుండీని అదిమినచో పనిచేసి కొంచెము సేపయినపిదప తగ్గిపోవును తిరిగి అది కొద్ది సెకండ్లయినతరువాత పనిచేయును ఈలోగా యితరవిధములగు రాకపోకలకు సావకాశమునిచ్చును.

### కేలికట్‌లో వాటంతటవి పనిచేయు ట్రాఫిక్ లైట్లు

14వ సెప్టెంబరు 65న కేలికట్‌వందు పాలయం రోడ్డు కూడలివద్ద మొదటిసారిగా వాటియంతట అవి పనిచేయు ట్రాఫిక్ లైట్ల ఉపయోగము ప్రారంభింపబడినది.

## 1939 వ సంవత్సరపు మోటారుబండ్ల చట్టము – పాలనావిధానము

## స్టేజి కారేజీలలో సామానులను కొనిపోవుటకు మోతఛార్జీలను స్థిరపరచుట – సవరణ – ప్రచురణ :

జి. ఒ ఎం యస్. నెం. 1880

16వ సెప్టెంబరు 1965

సవరణ :

పైన చెప్పబడిన ప్రచురణలో 1 వ క్లాజు స్థానే యీ దిగువ నుదహరించిన క్లాజు చేర్చ బడవలయును.

(1) యుక్తవయస్కుని (అడల్టు)యొక్కయు బాలునియొక్కయు స్వంతసామానుల విషయములో క్రమముగా 20 కి. జి. 10 కి. జి. ల వరకును రుసుము చెల్లింపనక్కరలేకుండ కొని పోబడవలయును.

ఈ సామానులలో సూటుకేసు యొక్క బరువు కూడ చేరియుండును.

(సం) డి. యస్. కపూర్.

గవర్నమెంటు డెప్యూటీ సెక్రటరి

---

బి) కొంతభాగపు సంపాదన నష్టము ... నుంచి ...... వరకును రోజుకు లేక వారమునకు ...... రేటు చొ॥ రు

సి. ఆస్పత్రికి చేర్చుటకు

డి అదనపు బలకరమగు ఆహారము

ఇ బట్టలకు, వస్తువులకులు చెరుపు

యఫ్. యితరములు

2. సాధారణపు నష్టపరిహారమునకు

ఎ. పడినబాధ, కష్టముకు నష్టపరిహాము

బి. ఏదయిన యెడతెగని అశక్తత లేక శాశ్వతమయిన అవస్థత కలిగినచో దానికి నష్టపరిహారము–

సి. సంపాదనాశక్తి లోపించినందుకు నష్ట పరిహాము–

26 హక్కుతీర్మానించుటలో అవసరమగునట్టి లేక సహాయకారియగు తదితర సమాచారముగాని

ఆంధ్రప్రదేశ ప్రభుత్వపు టుత్తరువు ప్రకారమును వారితరఫునను

## ఆంధ్రప్రదేశ రవాణా కమీషనరు శ్రీ హెచ్. సాంబమూర్తి ( ఐ. ఏ. యస్. ) గారి టూరు కార్యక్రమము

| తేది | వివరములు |
|---|---|
| 14—12—1965 | విజయవాడ వెళ్ళుదురు<br>స్థానిక రవాణా ఆఫీసరు కచేరీని సందర్శింతురు.<br>రాత్రికి విజయవాడలో నిలచెదరు. |
| 15—12—65 | కాకినాడ వెళ్ళుదురు.<br>రూటు తనిఖీ చేయుదురు. కాకినాడలో నిలచి పోవుదురు. |
| 16—12—65 నుండి 17—12—65 వరకు | డిప్యూటీ ట్రాన్సుపోర్టు కమీషనరుగారి ఆఫీసును తనిఖీ చేయుదురు. |
| 18—12—65 | ఉదయము స్థానిక రీజనల్ ట్రాన్సుపోర్టు ఆఫీసరు గారి ఆఫీసును తనిఖీ చేయుదురు.<br>సాయంత్రము రూటులను తనిఖీ చేయుదురు. అన్నవరములో నిలచిపోవుదురు. |
| 19—12—65 | రాజమండ్రి వెళ్ళుదురు<br>స్థానిక రూటులను తనిఖీ చేయుదురు. |
| 24—11—65 | ఏలూరు వెళ్ళుదురు<br>రీజనల్ ట్రాన్సుపోర్టు ఆఫీసరుగారితో చర్చలు జరుపుదురు.<br>సాయంత్రము విజయవాడకు పోవుదురు.<br>విజయవాడలో నిలచిపోవుదురు. |
| 21—12—65 | ఉదయమున హైదరాబాదునకు తిరిగి పోవుదురు |

— ఆంధ్రప్రదేశ్ రవాణా కమీషనర్ – హైదరాబాద్



మద్రాసు టాక్సీ నిబంధనలు–

బండ్లు నిలిపియుంచు ప్రదేశము కాదు!

రీజి ల్ ప్యాస్‌పోర్టు యిమిగ్రేషను ఆఫీసు (స్థనాంతరములను పోవువారికి స్థానికముగా ప్యాసుపోర్టునిచ్చు ఆఫీసు) యెదుట జార్జిటవును లోని మూర్ నల్లముత్తు వీధితాలూకు 20 అడుగుల పీలిక స్థలమునందు యింతటినుంచి టాక్సీలు నిలిపియుంచరాదని పోలీసువారివల్ల ప్రచురింపబడినది.

♦ ♦ ♦

1965 సంవత్సరంలో ఆటోక్లబ్ మెంబర్లుగా యీ దిగువవారిని యెన్నుకున్నారు–

శ్రీ జె వి.యస్. కె బాపనరావు ప్రెసిడెంటు
శ్రీ వి. యస్ ఆర్. శాస్త్రి, వైస్ ప్రెసిడెంటు
శ్రీ యస్ వి సుబ్బారావు. సెక్రటరి
శ్రీ పి. వెంకటరాయుడు. జాయింటు సెక్రటరి
శ్రీ టి. బాలసత్యనారాయణ, ట్రెజరరు

కమిటీ మెంబరులు–

1. కె యల్. నారాయణరావుగారు
2 కె. పాండురంగరావుగారు
3. కె. మంగరాజుగారు
4. అమర్‌లాల్ భాటియా
5. టి. మారుతి ప్రసాద్‌గారు
6. కె. మురళీకృష్ణగారు
7. వి వి. నారాయణరావుగారు
8. ఎ క్రిష్ణమూర్తి గారు
9 శ్రీ అజిత్ సింగ్ సిఖా
10. ఎ యం. కె. మోహనరావుగారు

♦ ♦ ♦

కోడమ్‌బాకమ్ ఓవర్ బ్రిడ్జి

ఇది 11–9–65 న తెరువబడినది. దీనియందలి ఒక విశేషమేమన రోడ్డు అంచు ప్రతిఫలించుట. ఇండియాలో యిదివరకే యేర్పాటు చేయబడినది. క్రిందుగా యినుపపట్టాలుగల కాలిబాటయొక్క అంచు రేకుకంటె పలచని సిమెంటు స్లాబులు కప్పబడి వాటిపై దీపముల కాంతి ప్రతిఫలించుటచే రోడ్డుఅంచు దగ్గరలోనున్నట్లు మోటారు డ్రయివరునకు హెచ్చరించును.

### ప్రధానమంత్రిచే కూకట్‌పల్లి బస్‌డిపో ప్రారంభోత్సవము :

రాష్ట్రములో రోడ్డురవాణా జాతీయము చేయ బడిన యత్తుగడ (విధానము) స్థిరముగా నుండు టకే ప్రారంభింపబడినది అంగీకరింపబడిన యీ విధానము నుండి వెనుకంజవేయుటయుండబోదు

ఆంధ్రప్రదేశ ప్రభుత్వ రోడ్డురవాణా కార్పొ రేషను యొక్క అయిదవ బస్ డిపోను కూకట్ పల్లివద్ద పారిశ్రామిక యెస్టేటు సమీపమున నెల కొల్పి, ప్రధానమంత్రి యింతవరకును రాష్ట్ర ములోని రహదారులలో 60 శాతము అధీనము లోనికి తీసికొనబడినవనియు మిగిలిన రహదారు లను కూడ తీసికొనుటకు ప్రతిపాదింపబడినదని నుడివిరి.

పబ్లిక్ సెక్టర్ సంస్థలు తాము సేవచేయు జనుల మనస్సులలో విశ్వాసము కలుగజేయ వలయునని, ఈ విశ్వాసము ముందుకుసాగుటకు అవసరమని బ్రహ్మానందరెడ్డిగారు చెప్పిరి

ఆర్. టి. సి. వి. బి రాజుగారు పట్టణ మందు రాకపోకలపద్ధతియభివృద్ధికై ప్లాను వేయు టకు, డబ్బుపెట్టుబడి అమలుజరుపుట ఈమూడు విషయముల కార్యక్రమమును నిర్వహించుటకు పట్టణాభివృద్ధి అథారిటీని యేర్పాటుచేయవలసిన దిగా కోరుతూ అంతకు పూర్వముచేసిన ప్రతి పాదనను ముఖ్యమంత్రి మెచ్చుకొనుచు పుర పాలక సంఘమును ప్రభుత్వమును యత్యావసర మగు సమస్యను పరిష్కరించుటకు తమ తమ ప్రయత్నములలో పరస్పరము తోడ్పాటుగా నుంటూ సాధనములను సమీకరణచేయవలయు ననిరి.

♦ ♦ ♦

### ప్ర తి ఘ ట న లే దు

సభాధ్యక్షులుగానున్న ఆర్థికమంత్రి డా. యమ్. చెన్నారెడ్డిగారు జాతీయకరణ విధాన మునకు ప్రతిఘటన అత్యల్పమగుచున్నదనిరి. ఈ విధానము అమలుపరచు మార్గములో ప్రభు త్వమునకు ఆర్థికపు తదితరమైనప్రతిబంధకములు వచ్చుచున్నవి

ఎ పి యస్ ఆర్. టి సి లు మోటారు బండ్ల విడిభాగములను తయారుచేయు ఫ్యాక్టరీ నెలకొల్పుటకై చేయుచున్న ప్రయత్నములు అభివందనీయములు అనియు కాని రవాణాకు సంబంధించిన పబ్లిక్ సెక్టర్ సంస్థలన్నియును తమ సాధన సామగ్రులను సమీకరణచేసి ఈ కార్యమును ప్రారంభించుట అంతకంటె మంచి దని చెప్పిరి. ♦♦♦

### వంశపారంపర్యాచేసే అనుభవవైద్యము :

అనేకమందికి మామందులు వాడి బాగుచేసి నాము. మేహజాతులకు, నల్ల, యెర్రమచ్చలు, నుసిమిరి, గలగండమాల, మూర్ఛలు, స్త్రీప్రద రములు, నరములబలహీనత, ముట్టుకుట్టునొప్పి, యింకా యితరవ్యాధులకు చికిత్సచేయబడును. మీ వ్యాధిలక్షణములు వ్రాసి పంపిన తగు మందులు వి పి గా పంపబడును.

ఇతరవివరములకు :—

వైద్యశ్రీ సి. సదాశివరావు, (రిజిష్టర్డు) ఏ. యమ్. పి.

కేరాఫ్ ఎడిటర్ : రవాణాసమాచార్ పత్రిక, కాంగ్రెసు ఆఫీసురోడ్డు, విజయవాడ-2

Edited, Printed and Published by J. Bhaskara Rao, Ravaana Samaachar, Congress Office Road, Vijayawada-2 and Printed at Graama Swarajya Press, Vijayawada-2
Wraper Printed at Jaya Printing Works, Vijayawada-2.